


# అచలబోధ - సంప్రదాయం

## ఒక అవగాహన

తేది 16-4-2003 బుధవారం

రచన :

యదార్థబోధోపదేశిక

**డాక్టరు కూన దయానంద స్వామి**
M.B.B.S. (MD)

సేవాసమాఖ్య ప్రధాన కార్యదర్శి

**శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య**

**శ్రీ భాగవతకృష్ణప్రభు ఆశ్రమము**

విశ్వేశ్వర నగర్, తాళ్ళగడ్డ - కార్వాన్, హైదరాబాద్ - 500 267




# అచలబోధ - సంప్రదాయం

# ఒక అవగాహన

తేది 16-4-2003 బుధవారం


రచన :

యదార్థబోధోపదేశిక

**డాక్టరు కూన దయానంద స్వామి**

M.B.B.S. (MD)

సేవాసమాఖ్య ప్రధాన కార్యదర్శి



**శ్రీ మదచల గరుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య**

**శ్రీ భాగవతకృష్ణప్రభు ఆశ్రమము**

విశ్వేశ్వర నగర్, తాళ్ళగడ్డ - కార్వాన్, హైదరాబాద్ - 500 267

ఓం

# అచలబోధ - సంప్రదాయం

## ఒక అవగాహన

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీ గురువేనమః

ఆచారాలు, అనుభవాలు, విశ్వాసాలే భారత సంస్కృతి సాంప్రదాయాలకు మూలం, సాంప్రదాయం వారసత్వ సంపద. పుట్టగానే దేశ పౌరసత్వం, కుటుంబవారసత్వం ఎలాగో అచలబోధలో ప్రవేశించగానే అచలబోధకు వారసులు. ఆది ఆచరించినప్పుడు సాంప్రదాయకులు.

సనాతనమైన ఆచలబోధను, తెలుగులో శ్రీమద్రామదుగు శివరామదీక్షితులువారు సిద్ధాంతీకరించి, బృహద్వాశిష్టం అను అచలబోధ సిద్దాంతాన్ని ప్రకటించినారు. ఆ సిద్దాంతాన్ని అనుసరించిన పారంపర్యులు శ్రీ శివరామ దీక్షిత అచల గురుపీఠమును ఏర్పాటుచేసి, ఆ పీఠ సాంప్రదాయులుగా కొనసాగుచున్నారు. ఈ సాంప్రదాయం చక్కగా తెలియనికొందరు దేవతా భ్రాంతిచే ఈ బోధకు బ్రహ్మపీఠం, విష్ణుపీఠం, నారాయణ పీఠం, శైవపీఠంఅని నామాలు పెడుతున్నారు. అది ఆచరిస్తూ వారే బ్రహ్మ సాంప్రదాయంలు, విష్ణు సాంప్రదాయులు, నారాయణ సాంప్రదాయులు, శైవ సాంప్రదాయులుఅని కల్పన చేసుకుంటున్నారు. ఈ అసాంప్రదాయ భావాలకు పారంపర్య పెద్దలు తగు సమాదానమేచెప్పియున్నారు. మళ్ళీ ఇప్పుడు ఆ భావాలకు శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తిగారు తెరిచిరాజు అనుటచేత ఈ వ్యాసం వ్రాయవలసి వచ్చింది. ఇది ఎవరినీ విమర్శించే ఉద్దేశ్యంతో వ్రాయలేదు. సంశయ నివృత్తి కొరకు సాంప్రదాయ గురువుల అభిప్రాయాల సంకలనమే ఈ రచన.

శ్రీ శివరామ దీక్షితులవారు నేను శ్రీధరస్వాముల నుండి తెలుసుకున్నానని, శ్రీ భాగవత కృష్ణ ప్రభు "నే పెద్దలచే విన్నది" అని, "నేజెప్పినట్లు జెప్పర" అని తెలిపినారు. పెద్దలు ఆచరించి విదానాన్ని అనుసరించడమే సాంప్రదాయం

కం॥ తప్పొప్పులు రెంట్నెరుగని
తప్పుతనందుండి దీన్ని తప్పని కూసే

తప్పుదు నరునకు జెప్పెద
చప్పుదు చాలించ మనుచు సభవారువినగ
సరెసరునని సభవారిట్లనగ॥

చెప్పిన వినకుంటే తప్పువానిదె సుమ్మి
తప్పు కలిగిన వెనుక గొప్పవాడెట్లౌను ॥ సభవారువిన
సరె సరెనాని సభవారిట్టనగ॥

అని కృష్ణ ప్రభువులు సెలవిచ్చినారు. తప్పు చేయడం సహజం. తప్పును సరిజేసుకున్నవారే గొప్పవారు. **"అసంప్రదాయవిత్ సర్వశాస్త్ర విదపి మూర్ఖావదేవ ఉపేక్షణీయః"** అనగా సంప్రదాయమను అనుసరించని వాదు, అతడు సకల శాస్త్రములు తెలిసిన వాడే అయినా మూర్ఖుని వలె ఉపేక్షించవలసినవాడని శంకరులవాక్యం.

## ఆదిగురువు దక్షిణామూర్తి :

***గురవే సర్వలోకానాం - బేషజే భవరోగిణామ్***
***నిధయే సర్వవిధ్యానాం - దక్షిణా మూర్తయేనమః***

సర్వలోకమునకు గురువు భవరోగములకు వైద్యుడు, సర్వ విద్యలకు విధియైన దక్షిణామూర్తికి నమస్సులు. సదా శివుడు గురువుగా సాక్షాత్కరించని రూపమే దక్షిణమూర్తి అవతారము, బ్రహ్మావాదుల సంశయములను ఛేదించుటకు మౌనమూర్తియై బ్రహ్మతత్వాన్ని ప్రసాదించినాడు. సాధారణంగా ఏ దేవతా మూర్తులైనా తుర్పుకొ పశ్చిమం వైపుకో చూస్తారు. దక్షిణ దిక్కునకు పాలకుడు యముడు మృత్యుభయం మీకుండదని చెప్పుటకే లయకర్తయగు దక్షిణమూర్తి దక్షిణవైపు చూస్తుంటాదు.

బ్రహ్మ విద్యాప్రాప్తి కొరకు వైకుంఠవాసులైన సనకసనందానాదులు సదాశివునికోసం కైలాసానికి వెళ్ళారు. బ్రహ్మ సృష్టికారుడు, విష్ణువు స్థితి కారకుడు, శివుడు లయ కారకుడు, సంహారం తిరోధానం అనగా కనబడకుండా లీనమవడం మరియు అనుగ్రహం అంటే మోక్షప్రదానం ఇవేలయము. అందుకే గురుశిష్య సంబందమైన గురుగీత పరమేశ్వరునిచే మొక్షము కొరకు చెప్పబడినది. సృష్టిలయమైనపుడు సర్వజీవులు లయమైతాయి. అప్పుదు సాక్షిత్వము వహించి చెప్పుటకు ఎవ్వరు ఉందరు. అందుకే సనకసనందనాదులు కైలాసం వెళ్ళారు. అసమయంలో స్వామి సతీసమేతుదై దేవగణం మద్య నృత్యంచేస్తున్నాదు. ఈ విధంగా నృత్యంచేసే సంసారి తమకు బ్రహ్మవిద్య ఎలా బోధిస్తాదని వెనుదిరిగినారు. దారిలో వస్తుండగా ఆ కైలాసంలోనే ఒకచోట బాలుని రూపములో చిన్ముద్ర, పుస్తకం,

స్పటికమాల, అగ్నిధరించి వటవృక్షం మూలంలో మౌనంతో కూర్చోని ఉన్నాడు. ఏకాంత మనోహరమైన ఆ మూర్తిని చూడగానే సనకసనందనాదులు, అతనినుండి బ్రహ్మ విద్యగ్రహించవచ్చనే భావంకలిగి సమీపానికి వెళ్ళారు. స్వామిచుట్టు వృద్ధులైన శిష్యులు కూర్చోనియున్నారు. వారంతా బ్రహ్మవాదులు. మాటద్వారా గ్రహించవలసినదంతా గ్రహించినారు. వాగాతీతమైన పరతత్వానందానం కొరకు ఆశ్రయించినారు. వారి సందేహాలన్నింటిని తన మౌనవ్యాఖ్యలతోనే నివృత్తి చేసినాడు. ఆ స్వామిని అలా చూడగానే సనకసనందనాదులకుకూడా సర్వసంశయములు తోలిగిపోయినవి. హృదయగ్రంధులు వీడిపోయినవి. ఆ విధంగా అందరూ దక్షణమూర్తినే ప్రధమ గురువుగా అంగీకరించినారు.

అచలబోధ విషయంలో దక్షణమూర్తి మౌనవ్యాఖ్య, ఆదిగురువు గురించి శ్రీ యిలుపకుర్తి రామచంద్రరావుగారు ఇలా వ్రాశారు. పరిపూర్ణబోద సిద్ధాంతమునకు ఆదిగురువు ఆ దక్షణమూర్తి అనియే భావించి నిత్యము గురుపరంపరా స్తోత్రములో పఠించుచున్నారు. శ్రీ దక్షణమూర్తి యొక్క మౌనవ్యాఖ్య వీరెట్లు అన్వయించుకొనిరనగా పరిపూర్ణ పరబ్రహ్మము శబ్దనిశ్శబ్దములకతీతము. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను చతుర్విద వాక్కులు లేనిది. అందు జ్ఞానాజ్ఞానరూపమగు యెరుకను స్థానము లేనేలేదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మముతప్ప అన్యము భ్రాంతివల్ల తోచబడేదంతయూ ఎరుకే. దానికి కారణము లేదు. అనగా మూలములేదు. ఎరుక కన్యమైనదొక్క పరిపూర్ణమే, అది ఎరుకకు ఎంత మాత్రము కారణముగాదు. ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మమునందు పుట్టనేలేదు. తోచనేలేదు. పుట్టనటువంటి తోచబడనటువంటి, ఎరుకచే ఏమతనిర్ణయములు చేయుదురు. 'నిర్ణయోనాస్తి సర్వదా' ఏ నిర్ణయములు పనికిరావు. ఏవిధంగాను నిర్ణయించజాలని పరిపర్ణ పరబ్రహ్మమే సత్యసిద్ధాంతము. అది వాక్కుచే (ఎరుకచే) యిదమిద్ధమని నిర్ణయించు నిర్ణయములన్నియూ భ్రాంతి రూపములే. కనుక మా మతము గొప్పది, మా మతము గొప్పది అని మీరు మీరు వాగ్వివాదులు చేయుట అవివేకమని పరిపూర్ణ బావజ్ఞులు శ్రీ దక్షణమూర్తి యొక్క మౌనవ్యాఖ్యను అర్ధము చేసుకొనిరి.

తెలుగులో ఈ పరిపూర్ణ బోదను సిద్ధాంతం చేసిన శ్రీ శివరామదీక్షితులవారు, దక్షణమూర్తి భావమును ఈ విధముగా శిరామదీక్షతీయ గ్రంధములో వెల్లడించియున్నారు. **"ఎరుక పుట్టనే లేదు. పరిపూర్ణమున్నదని చెప్పువారెవరు. శ్రీ దక్షణమూర్తి వారిది, మరీ సూక్ష్మప్రజ్ఞాదురంధరులకు బోధించిన అతీతమార్గము"** అన్నారని వ్రాసినారు. బహుశా రామచంద్రరావుగారు చివరిగా వ్రాసిన వ్యాసం ఇదే అయుంటుంది.

రాజయోగి విజయం (1961)లోనూ రాజయోగి జననాన్ని ఆదిగురువు శివనితోను ఒక భక్తురాలి మాటగా ఆదిగురువు దక్షిణమూర్తియని రామంచంద్రరావుగారు వ్రాసినారు.

1965 నుండి 1977 వరకు వెలుబడిన రాజయోగి మాసపత్రికయందు పృచ్ఛకుల సంశయాలకు సమాదానము వ్రాసినారు. శ్రీ మహావిష్ణు పర్యంతం, లేదా మహాశివుని పర్యంతం ఏది సరియైనది అనే దానికి పరమశివుని అవతారం శ్రీ దక్షిణమూర్తి అని వేదాంత సాంప్రదాయులచేతను, కీర్తింపబడుచున్నాడు. శ్రీ భాగవత కృష్ణదేశికస్వామి కూడా తమ కందపద్యాలలో

కం॥ దక్షిణమూర్తియనదగు
నీక్షితి శివరామనామ దీక్షితులనుచున్
వీక్షింతు రార్యులతనిక
పేక్షను దండములుబెట్టి ప్రేమనుతింతున్

అంటూ దక్షిణమూర్తియందు తమ విశేషభక్తిని వెల్లడించినారు. కాని బాగవతుల శ్రీ కృష్ణ దేశికస్వాముల వారిది శ్రీ మహావిష్ణు సాంప్రదాయమని వారిగురు పరంపర శీర్షికలో గానవచ్చుచున్నది. అంతేకాదు గురుపరంపరలో ప్రధమ శ్లోకములో

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యాగురువిష్ణు సూర్యం
శ్రీ యజ్ఞ వల్కంచ జనకంశుకంచ..

అని చెప్పబడే శ్లోకంలో శ్రీ దక్షిణమూర్తి వారిని వదిలివేసినట్లుగా తోస్తుంది. కాని ఇందు విష్ణువునకు ముందుచెప్పబడిన బ్రహ్మవిద్యాగురువు అనువారు ఎవరు? ఆ గురువు దక్షిణమూర్తియే అయివుండవచ్చును. కనుక పరంపర మహాశివుని పర్యంతంఅని చెప్పినా, శ్రీ మహావిష్ణు అనిచెప్పినా ఒక్కటే. అంతేకాక వారి ఇష్టదైవమెవరో వారే ప్రధమ గురువు అని చెప్పుటకే ఈ శ్లోకం అవకాశమిస్తుంది. శివకేశవులకు బేధం లేదనుకొన్నచో ఏ బాధాలేదని వ్రాశారు.

శ్రీ బాగవతుల కృష్ణప్రభులది శ్రీ మహావిష్ణు సాంప్రదాయం అని ప్రకటించిన వారికి చురక పెడుతూ, వారు దక్షిణమూర్తిని ఆదిగురువుగా చెప్పి ఈ బోధకు శివరామ దీక్షితులు అంతటివారేనని చెప్పుటచేత ఆదిగురువు దక్షిణమూర్తియని ఈ సిద్ధాంతమునకు ఆదిగురువు శివరామదీక్షితులని స్పష్టపరిచినారు. శ్రీ మహావిష్ణుపర్యంతం అని ఆరోపణ చేసినవారికి శ్రీ బ్రహ్మవిద్యాగురు అంటే దక్షిణమూర్తియేనని తెలియజేసినారు, అయినా శివకేశవులకు బేధంలేదని, గురుపరమాత్మనే అనన్యభక్తిచే కొలవాలని గురువు దగ్గర మతబేధం పాటించకూడదని చెప్పకనే చెప్పినారు.

బ్రహ్మానందగిరి **"....ఇంతకు శ్రీమన్నారాయణుడాదిగురువా? బ్రహ్మదేవుడాదిగురువా?"** అని లేవదీసిన ప్రశ్నకు బ్రహ్మాదులంటే బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు మరియు బ్రహ్మమునెరిగినవారిని ఆదిగురువు దక్షణమూర్తియేయని నిరూపించి శ్రీ రామచంద్రరావుగారు బ్రహ్మానందగిరిని అసాంప్రదాయకునిగా నిర్ణయించి పుస్తక రూపములో ప్రకటించినారు.

కడవేటి నర్సారెడ్డిగారు 1955లో నిజ ప్రభోద విధానమునకు పీఠిక వ్రాస్తూ 'శ్రీ మహావిష్ణుమొదలుకొని' అని పొరపాటుగా వ్రాసి, తరువాతఅదే సంవత్సరము ఆయన వ్రాసిన శ్రీమదభినవదీక్షితీయం ఉపాననాకాండే అను గ్రంధమునందు అచలగురుపరంపరాధ్యానంలో

**శ్లో॥ శ్రీ దక్షణమూర్తి గురుం నమామి**
**నిర్వాసనామౌన సమిష్టి దృష్టిమ్**
**నిరస్త సందేహ విశుద్ధ పూర్ణమ్**
**శ్రీవిష్ణు బ్రహ్మామరబృందవందితమ్** అని దక్షణమూర్తిని స్తుతించారు.

పై విషయములను బట్టి శివరామదీక్షితులనుండి రామచంద్రరావుగారి వరకు దక్షణమూర్తియే ఆదిగురువని నిర్ణయించినారు.

## విష్ణువు:

శ్రీ భాగవతకృష్ణదేశికులది విష్ణు సాంప్రదాయమా అనే విషయాన్ని పరిశీలించాలి.

శ్రీ భాగవతకృష్ణదేశికులవారి యొక్క గురువు పరుశురామ సీతారామస్వామి, వారి సోదరులు పరుశురామ నర్సింహాదాసు, రామునిపేరుతో భద్రాద్రి రామశతకం, పరుశురామ సీతారామశతకం వ్రాయుటచేతను, భాగవతకృష్ణదేశికులు పూర్వాశ్రమంలో రామభక్తులవటంచేతను విష్ణుభక్తులుగా తర్వాతవారు భ్రమించినారు.

శ్రీ పరుశురామ నర్సింహాదాసుగారు భద్రాద్రి రామశతకం వ్రాసే కాలమున దేశమునకు స్వాతంత్ర్యము లేదు. భక్తి ఉద్యమాలు చాలా వ్యాప్తిలో ఉన్నాయి. అన్య మతపాలనలో నుండి భావస్వాతంత్ర్యములేని రోజులలో పరిపూర్ణ బోదను ప్రచురించుటకు కాలానికి అనుగుణంగా ఆయన రచన సాగింది. అందుకే **"శ్రీగణాదీశుని సేవించి వినుతించి"** అని ప్రారంభించి **"కేశవాగోవిందకృష్ణదామోదరా"** అను ఐదు పద్యములలో సాకార దేవతలను వర్ణించినారు. ఆరవ వద్యమునుండి ఆత్మబోధ ప్రారంభించి **"నిత్యనిరాకారనిరుపద్రవాఖండ... స్వస్వరూపము నిస్సంశయముగా। వారిజాసన కైలాసవాస**

**వాసవాదులకునైన వర్ణింపనలవిగాదు"** అని వ్రాసినారు. **"సదేవసోమ్యేఽదమగ్ర ఆసీద్ ఏకమేవాఽద్వితీయం"** సృష్టికి పూర్వం బ్రహ్మమొక్కటే, తన కన్యముగా రెండవది లేకయుండెను. అలాంటి స్వస్వరూపమును వర్ణించుటకు వారిజాసనుడు అనగా విష్ణువు, కైలాసవాసుడు శివుడు మరియు ఆయాలోకవాసులెవరూ ఆతత్వాన్ని వర్ణింపలేరనుటలో ఏ సంశయములేదు. ఐదు పద్యాలలో దైవస్తుతి చేసి ఆరవ పద్యములో ఆయాదేవతలకే ఆ తత్వము తెలియదని చెప్పుటచేతను మరియు మనిపూరక చక్రముగురించి వ్రాస్తూ **"నీవేవిష్ణురూపమై నిలిచినావు"** అనే భావాలను బట్టి వారు దేశకాల పరిస్థితులకనుగునంగా వ్రాసినారేకాని, విష్ణుభక్తిచే కాదని తెలియుచున్నది.

శ్రీ భాగవత కృష్ణప్రభువులవారు కందార్ధములను జనులారా అని సంబోదిస్తూ రచన ప్రారంభించినారు. శుశ్రూషకు, గురుభక్తికి సరియైన నిర్వచనముచేసినారు. వైరుధ్య బావముగల శైవ వైష్ణవ మతాల ఇరువురికి గురుభక్తి ప్రబోదించినారు.

**కం॥ దేశికుని చరణతీర్థము**
**కాశిగంగయని గురునికనుగొన్నను వి**
**శ్వేశుడని యతదుతనకుప**
**దేశంబోనరించినట్టిదే తారకమని॥**
**మనసందు తానీతీరునగని। యేసీమయందున్న**
**కాశీ ప్రయాగ రామేశునిపురమై ప్ర**
**కాశించునాసీమ । దేతారకమని**
**మనసందు తానీతీరునగని॥**

అని శైవభక్తులకు గురుభక్తి ప్రాశస్త్యాన్ని ప్రభోదించినారు.

కం॥ గురుచరణ జలము గోదా
వరియని గురుమూర్తి రామభద్రుండని త
త్పురమును భద్రాచలమని
గురుమంత్రమే తారకమని గురిగల్గినట్టి
తిరిగిరాని మరుగెరిగినట్టి
నరుడున్నచోటే సుందరశేషగిరి భద్ర
గిరి రంగనాయకపురమన దగియుండు
గురిగల్గినట్టి తిరిగిరాని మరుగెరిగినట్టి

అని వైష్ణవులకు గురుభక్తిని ప్రభోదించినారు. అయినా కొందరు గురుమహత్యాన్ని, గురుభక్తి

విశిష్టతను తెలియలేక గురుడునరుడనితలచి శివకేశవులను జపిస్తున్నారు. విష్ణు సహస్రనామాలను, లలిత సహస్రనామాలను పారాయణం చేస్తున్నారు. అలాంటివారు మతపిచ్చి వదలక తనను సందేహిస్తారేమోనని

**కం॥ అల భద్రాచలమనిన బ**
**యలుగా గుర్తెరుగవలయు, యెరుకను విష్ణం ।**
**దుల దోచి గురుని కృపచే**
**నిలువక విష్ణ్వగిరిపోతే నిశ్యయమదేరా ॥**
**కృష్ణదాసు నిశ్చయమదేరా॥**

అని తన నిశ్చయాన్ని తెలియచేసినారు. ఇంకనూ **"శ్రీ వనితేశ రాజీవసంభవ భవదేవేంద్రాదులనింక సేవింప తలపేలా"** శ్రీ వనితేశుడనగా విష్ణువు, రాజీవ సంభవుడు బ్రహ్మ, భవుడంటే శివుడు, దేవేంద్రాదులనగా దేవేంద్రుడు మొ॥గు దేవతలను పూజించాలనే ఆలోచన వద్దని చెప్పినారు. కావున శ్రీ భాగవతకృష్ణదేశికులను విష్ణుభక్తులుగా సాంప్రదాయులెవరు భ్రమపడరు.

విష్ణువు గురించి ఒక ప్రశ్నకు యిలుపకుర్తి రామచంద్రరావుగారు ఈ విధంగా వ్రాశారు.

విష్ణువు, శంకుచక్ర, గదపద్మాదులు, చతుర్బాహువులయందు ధరించి వైకుంటమని చెప్పబడే లోకపాలకుడా? లేక **"సర్వవ్యాపకోవిష్ణువు"** అన్నట్లు ఆకాశమువలె సర్వత్రా వ్యాపించిన వస్తువా? బ్రహ్మావిద్యాగురు అని చెప్పబడినా గురుత్వమే వ్యాపక ధర్మముచే విష్ణువని రెండవ పేరు వహించెను. ..... ఈ దృష్టిలో యోచిస్తే వైకుంఠనాదుడగు విష్ణువు దశావతారములు దాల్చినవాడు ఆదిగురువు కాడనియే చెప్పవలెనని వ్రాయుటచేత విష్ణుపీఠము, విష్ణు సాంప్రదాయమనుమాటకు అర్థం లేదు.

## అచలగురుపీఠము:

**'పీఠ్యంతీసంశ్లిష్యతే పీఠః'** అనగా పొందబడునది. దీనియందు ఆసీనులగునది పీఠము. పీఠం అనే సంస్కృత పదానికి పీట లేక ఆసనము అనిఅర్థం. పరంపరాగతంగా వస్తున్న దైవాన్ని పూజించడానికి ఏర్పాటు చేసింది పీఠం. గురుపీఠం అంటే గురువనే దైవాన్ని పూజించటినికి చేసిన ఆసనమే గురుపీఠం ఆ పీఠంపై గురువు ఆసీనులై ఉంటారు. నవవిధగురవులు, ఎవరికైనా ఆ పీఠం వర్తిస్తుంది. కావున అచల బోదపరులు అచలగురుపీఠం అని విశేషంగా చెప్పుకొనుచున్నారు. అప్పుడు ఆ పీఠం అచలగురువుకే

పరిమితమవుతుంది. ఇక బ్రహ్మపీఠం, విష్ణుపీఠం, ఈశ్వరపీఠం, నారాయణపీఠం అని పుట్టుకొచ్చే పుట్టగొడుగుల్లాంటి పీఠాలపై ఆయామూర్తులే ఆసీనులౌతారు. అప్పుడు గురుపూజలు వదిలి, బ్రహ్మపూజ, విష్ణుపూజ, ఈశ్వరపూజ, నారాయణపూజలు చేయవలసియుంటుంది. గురుబ్రహ్మ శ్లోకానికి అర్థంతెలియని, అనుభవంలేని వారు ప్రభలిన దేవతాభ్రాంతి చేత ఆపేరులు పెట్టుకుంటున్నారని మనం అర్థంచేసుకొవలసి ఉంటుంది.

అచలపీఠాన్ని శ్రీవెంకటేశ్వర ఆవదూతగారు ఓంకార పీఠమని అన్నారు. దానికి యిలుపకుర్తి రామచంద్రారావుగారు సవివరణచేస్తూ ప్రణవాతీతమైన పరిపూర్ణబోధ సిద్ధాంతమునదగునేకాని ఓంకారపీఠ సిద్ధాంతమనదగునా అంటే పరిపూర్ణ బోధ ఓంకార రహితమైన బోధయైనా, పీఠమును ఓంకారపీఠమనుటలో తప్పులేదు. అప్పుడు ఓంకార సిద్ధాంతమనగా, ఓంకారపీఠమువారియొక్క సిద్ధాంతమని **'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' 'ఓం యిత్యుపాసిత'** అనిన్ని శృతులు పలుకుచున్నవి. గురుత్వము ఓంకారము యొక్క ఆవరణ స్వరూపమేగాని అన్యముగాదు. అన్ని ఉపాసనలుమాని ఒక్క గురుత్వమనే గురుకృపాసిద్ధికై ఉపాసనగావించు సాంప్రదాయం ఈ యొక్కదీక్షిత సాంప్రదాయమేఅని, ఓంకారమే సింహాసనముగాగలిగి దానిని ఆధిష్టించియున్నది గురుత్వమని, గురుగీతలోని శ్లోకాన్ని ఇలా వివరించినారు. ***"ఊర్థ్వామ్నాయ గురోఃపదం త్రిభువనోంకారాఖ్య సింహాసనం"*** అని గురుమూర్తి అభివర్ణింపబడినాడు. అంటే గురుపదం ఓంకారమనే పేరుగల సింహాసనమును అధిష్టించియున్నాడన్నమాట. కనుక ఓంకారపీఠమన్న ఓంకార సింహాసనమన్న ఒక్కటే గురుపదము ఓంకారముకన్నాగూడ గొప్పదేయన్నఅర్థము సూచించును. ఓంకార, గురుపథములరెంటికన్నా విలక్షణమైనది పరిపూర్ణ పరబ్రహ్మమని వ్రాసినారు.

## అచల బోధ సిద్ధాంతము:

**సిద్ధాంతం :** సిద్ధాంతము అనగా పరిశీలనతో ప్రతిపాదించి, నిరూపించబడిన ఖచ్చితమైన భావము

శ్రీమద్రామడుగు శివరామదీక్షితులవారిచే రచింపబడిన గ్రంధమునకు **"బృహద్వాసిష్టము అను శివరామదీక్షితీయం"** అని పేరు. అందులో ప్రతిపాదించిన సిద్ధాంతము **'అచలబోధ సిద్ధాంతము'.**

**బృహద్వాశిష్ట సిద్ధాంతము :** దీక్షితులవారు వ్రాసిన బృహద్వాశిష్టము అను గ్రంధములో ప్రతిపాదింపబడిన సిద్ధాంతము కావున అది బృహద్వాశిష్ట సిద్ధాంతము అంటారు.

**శివరామదీక్షిత సిద్ధాంతము:** శివరామదీక్షితులచే చెప్పబడినది కావున దీనిని శివరామదీక్షిత సిద్ధాంతము అంటారు.

**అచల సిద్ధాంతము :** అచలమును సత్యమైనదిగా, శ్వాశ్వతమైనదిగా ప్రతిపాదించుటచేత దీనిని అచల సిద్ధాంతము అంటారు.

**పరిపూర్ణ సిద్ధాంతము :** దీక్షితులవారు అచలమునకు పరిపూర్ణమను మరొక పేరును అచలనామములలో సూచించుటచేత దీనిని పరిపూర్ణ సిద్ధాంతము అంటారు.

**పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము:** శ్రీశివరామదీక్షిత నిజగురు సాంప్రదాయకపెద్దలందరూ, సన్యాసాశ్రమ నిరసనగావించి గృహస్థాశ్రమమునే శ్లాగించినవారగుటచేతను, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయపురుషయోగముల నాల్గింటికన్నను పరిపూర్ణ రాజయోగముమిన్నయగుటచే పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతమని యిలువకుర్తి రామచంద్రారావుగారు నామకరణము చేసినారు.

## అచలబోధ సాంప్రదాయము:

సాంప్రదాయమనగా విస్తృతార్థంఉన్నా, పెద్దలనుండి వచ్చినా వాడుకఅని, వారి ఆచారవ్యవహారాలు, అభిప్రాయాలు, విశ్వాసాలను తరువాత తరంవారు ఆచరించడాన్ని సాంప్రదాయం అనవచ్చును.

అచల సిద్ధాంతము అనుసరించే వారంతా శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయమని, దీక్షిత సాంప్రదాయమని, అచలగురు సాంప్రదాయము, అచల సాంప్రదయము, అచలఋషి సాంప్రదాయము, నిజగురు సాంప్రదాయము, అశరీర సాంప్రదాయము అని చెప్పుకుంటున్నారు. విష్ణుసాంప్రదాయము అని ప్రకటించిన శ్రీనివాసమూర్తిగారు కూడా అదే పత్రికలో దీక్షిత సాంప్రదాయం, అచలఋషి సాంప్రదాయం అని ద్వంద్వభావం వ్యక్తం చేసినారు.

దీక్షితులవారికన్నాముందు ఈ బోధలేదా అనే సందేహము కలుగుట సహజము అందుకు దీక్షితులవారే ఈబోధ సనాతనమైనదని శ్రీధరస్వామికి, జ్ఞానేశ్వరులకు, శుకసాందీపకృష్ణులకు ఈ భావం తెలుసని చెప్పటంచేత ఉత్తరగీతలోన్ని కొన్ని శ్లోకాలు దీక్షితులవారు వ్రాసిన భ్రాంతిరహిత శ్లోకాలనుబట్టి, అచలభావం సనాతనమైనదేనని స్పష్టమగుచున్నది. బయలు శబ్దాన్ని వీరశైవులు, అద్వైతపరులైన వీరబ్రహ్మంగారును, విరివిగా వాడినారు. అచలభావం మొదట తెలుగులో వేమనచే చెప్పబడినది. కాని ఆయన

భక్తి, జ్ఞాన, వైరాగ్య, యోగ, నీతి మొదలగు అనేక విషయాలతో కలగూరగంపవలె చెప్పుటచే ఆభావం తేటపడలేదు.

న్యూటనుకన్నా ముందు భూమికి గురుత్వాకర్షణ శక్తిఉన్నా న్యూటను కనుగొనినాడని పేరెట్లు వచ్చిందో, రామానుజులకన్నా ముందు 12 మంది ఆళ్వారులున్నా ఆయనే ఆ మతకర్తయని, శంకరులకన్నాపూర్వం కాశ్వీరాద్వైతం, తత్వమసివాక్యం, గౌడపాదుల అజాతం, గోవిందులు ఉన్నా ఆయనకే అద్వైతకర్తగా, తనకన్నా ముందు 23 మంది తీర్థంకరులున్నా మహావీరునికే జైనమతకర్తయని పేరెట్లువచ్చిందో, అదేవిదంగా శివరామదీక్షితులుకన్నాముందు అచలభావం ఉన్నా దాన్నెవరూ సిద్ధాంతం చేయలేదు కాబట్టే అయనకే అచలబోధ ప్రతిష్ఠాపనాచుర్యులనే పేరు వచ్చింది.

అచలబోధకు మూడు శతాబ్ధాల చరిత్రయున్నది. 18వ శతాబ్దం దీక్షితులవారికి, 19వ శతాబ్దం భాగవతకృష్ణప్రభువులకు, 20వ శతాబ్దం పొన్నాల రాజయోగికి చెందినదిగా టూకిగా చెప్పవచ్చును.

అచలబోధ వాఙ్మయంలో భద్రాద్రి రామశతకము అభ్యసనమునకు (శ్రవణం), కందార్థములు అధ్యయనమునకు(మననం), దీక్షితీయము సిద్ధాంతమునకు(విధిద్యాస) సంబందించిన గ్రంధములు. భద్రాద్రి రామశతకం కందార్థములు పద్యగ్రంధాలు. దీక్షితీయము గద్యమైనా శాస్త్రచర్చ, మత నిరసన, సిద్ధాంత నిరూపణలచే సరిపోయినది. రాజయోగి రచనలు సంక్లిష్టమైనవి. రామచంద్రరావుగారిది అచలవాఙ్మయములో విషిష్టమైన స్థానము. స్పష్టతతోకూడిన విషయ విశ్లేషణతో సరళముగా సమకాలీన భాషలో సాగినది. విషయ పరిచయం, పరిజ్ఞానంకొరకు వెంపర్లాడే పరిశోధకులకు, విమర్శకులకు, అకాడమీ వారికి ఉపయుక్తమైయున్నది. కావున వీరందరి అభిప్రాయములకు సాంప్రదాయములో అత్యంత గౌరవము.

పీఠము పీఠాధికారముఅనేది రాజయోగిగారినుండే ప్రారంభమైనది. శ్రీ హనుమంతరాజయోగి ఆదేశానుసారము 1933లో తన ఇంటిలోనే శివరామదీక్షితాచల గురుపీఠమును రాజయోగిగారు స్థాపించినారు. 17-5-1935న అవదూతగారిచే పీఠాధికార శాసనం పొందినారు. అయినను వారిని పీఠాధిపతులు లేదా శ్రీ శివరామదీక్షితాచలర్షి పరిపూర్ణ సాంప్రదాయక నిజగురుమూర్తులగు శ్రీమత్ దయానంద పొన్నాల రాజయార్య రాజయోగి గారనే పిలిచేవారు (అచలఋషి వేమన మాసపత్రిక: 1949) అనుష్టాన విధినుండి గ్రంధముల అధ్రసులవరకు శివరామదీక్షిత సాంప్రదాయమనే అనేవారు. పరిపూర్ణ రాజవిద్య

రాజగుహ్య శిఖామణిలో వారు నిరూపించిన తత్వాన్ని అచలబుషి సాంప్రదాయ తత్వశాస్త్ర నిర్ణయమని ప్రకటించినారు.

ఇక రామంచంద్రారావుగారి ప్రధమ కుసుమము రాజయోగి విజయము నుండి ప్రింటువేయించిన అన్ని గ్రంధాలలోనూ శివరామదీక్షిత అచలగురుపీఠ సాంప్రదాయమనేయున్నది. రాజయోగిగారుకాని వారిశిష్యులు రామచంద్రారావుగారుకాని యెక్కడ విష్ణుసాంప్రదాయమనలేదనేది అక్షరసత్యం.

శ్రీ శివరామదీక్షితులు ప్రతిపాదించిన అచలసిద్ధాంతము శ్రీధరస్వామికి జ్ఞానేశ్వరునకు, కృష్ణునకు, సాందీపునకు, శుకునకు, జనకునకు, యాజ్ఞవల్కికి (సర్వసారపూర్ణోపనిషత్తు వలన విష్ణువుకు) ఈ భావము తెలుసని దీక్షితులవారు వారిని కొనియాడినారు. సాంప్రదాయాన్ని కూలంకషంగా ఆర్ధంచేసుకున్న అవదూతగారు. ఇరుతెరగుల పరిశీలనచేసి నిత్యానుష్టాన శ్లోకములను వ్రాసినారు. అవే సాంప్రదాయ పారాయణ స్తోత్రాలు.

సనాతనమైన భావానికి వ్యక్తిపేరు ఉంటే విలువ తగ్గుతుందని, పైగా సనాతన సాంప్రదాయం లేనట్టుగా తోస్తుందని, విచారించిన పెద్దలు సిద్ధాంతమును అచలబోధ సిద్ధాంతమని, సాంప్రదాయమును శివరామదీక్షిత సాంప్రదాయమని, పీఠమును అచలగురుపీఠమని, ఆశ్రమమును రాజయోగాశ్రమమని పేర్కొనుచున్నారు.

ఇదే అచలబోధ సాంప్రదాయుల అవగాహన.



